

శ్రీ

కృష్ణః గురవః బ్రహ్మణేనమః.

# రామాయణాంతరార్థప్రకాశిక

సీసార్థములు.

ఇష్టదేవతాభివందనము.

శ్రీమద్రమారమణీమణీహృదయాంబు
జాంబుజప్రియు నాత్మ నభినుతించి ।

హైమవతీమనఃకామితార్థప్రదు
పర్దురంతభక్తిశోకంబున్ స్తుతించి
వాగ్గురుణీమణీవల్లభుచరణముల్
శరణమ్ము లంచు నే సంస్తుతించి ।
ప్రారంభమందు నా హేరంబుఁ గీర్తించి॥

దరువు॥ ప్రాచీనకవులా కెల్లాను । వందనముఁజేసి
ప్రస్తుతకవులానెల్లాను యోచించిమదిలో సం।
కోచము లెల్ల వి । మోచనగుట కెం।లో చిం
తనముఁ సేతు ॥పా॥

2. అనుచు నే సర్వదేవాభివందనముఁ జే
సి నవీనగ్రంథమ్ముఁ జేయ నెంచి ।
యుండఁ గొండాలివాసుండు శ్రీ జొన్నల
గడ్డవంశాబ్ధిరాకాశశి యన ।
రంజిల్లు వేంకటరత్నాభిధానున
కమలాత్మ కామేశ్వరాంబకున్ సు।
మారుఁడర్థిజనమందారభూరుహ మనం॥

దరువు॥ గావినుతిఁగాంచిన॥ వేంకటసుబ్బయ్య గు,
ణావహుని మించిన॥ ధీవరుఁడీపృ। ధ్వీవలయ
మున లే । డీవయనునం దెవ్వ । రిపథిఁ జెలఁగి
రనగ ॥గావి॥

3. అయ్యనఘుఁడు న న్నాదరంబునఁగాంచి
యెలమిమీరంగఁ దా నిట్టులనియె।
ననఘాత్మ! మీకృతం బైయొప్పు గ్రంథముల్
జదువఁ జదువ ముదం బొదవుచుండుఁ।
గాని నామదినొక్క కాంక్షగలిగెనెద్ది
యనఁగ రామాయణంబునకు నంత।
రార్థంబుఁ దెల్లమౌ నట్టులుగా వ్రాసి॥
దరువు॥ పరిచరింపఁ దగునటంచూ ।కోరెద ను।రు
చిరముగారక్షించూ॥ మచలాత్మజకుఁ బూర్వ
మచలానిలయుఁడు కృప । వచియించినటుల
న । ముచితముగా దాని ॥ప్ర॥

4. అనిననే నిట్లంటి నానందమొంది శ్రీ
రామాయణాంతరార్థంబు నరసి।
శివుఁ డగతనయకుఁ జెప్పినవిధ మెల్ల
నా నేర్చిన కొలంది నయముమీర ।
సంగ్రహంబుగ సర్వజనరంజకంబుగా
నాంధ్రీకరించెద నాలకింపు।
మదిగాక తత్త్వజ్ఞు లలరుచు గ్రంథంబుఁ॥
దరువు॥ జదివి మెచ్చుకొనంగా । ముక్తికి న । త్పద
వీ సోపానంగా॥ పదములముగనిం।పొద వేఁడి

యంతరార్థ । మదిరా! క్లుప్తీకరించి యొ । ప్పథ
మునఁగూర్చెనో! యని" చ॥

5. శ్రీసముంచిత చిద్విలాసమాక్తి లాస
భాసపట్కాంతరోద్భాసమందుఁ।
ప్రమథాది సంయమిప్రవరులు సేవింప
నమితహర్షమున భద్రాసనమున।
భాసిల్లు నాకృత్తివాసుని వామపా
ర్శ్వమున భవాని సంభ్రమము మీరఁ।
జేరి ముచ్చటలాడ మీరియాశివుఁడు స॥

దరు॥ ముదమునొంది యా సతిని । గనుఁగొని
ప్రేమ మొదవఁ బల్కెనీ గతినీ । సుదతీ!
యిత్తరి నే । య్యదియో । నీయభిలాష మది
దెల్పుదిత్తునే । య్యదియైనఁగానీయనెస ॥ముదము॥

6. అన్నంత నాహిమవన్నగాత్మజ నితాం
తానందమంది సానూనభక్తి ।
భర్త పాదములకుఁ బ్రణమిల్లి యంజలీ
బద్ధయై ప్రేమతోఁ బల్కె నిటుల।
ప్రాణేశ! శ్రీమహారామాయణాంతరా
ర్థంబు వినఁగనభీష్టంబుఁ గలుగు।
గాన నయ్యదియెఱుంగఁగ వినిపించినఁ॥

దరువు॥ ధన్యురాలఁగఁ జేయుమా । సకలసుర
మాన్యాభీష్టముఁ దీర్పుమా॥ అన్యాభిలాష
లేద । నన్యజాంతకసా । మాన్యమనఁగా।
రుణ్యముతోఁ దెల్పినను॥ ధ॥

7. అంతనా ప్రేయసి సనురాగముననఁ గాంచి
యోలమి సదాశివుం డిట్లులనియె।
సతివరో! నీవడు గర్వంబు బహుగుప్త
మైనఁ దెల్పెదఁ జేర్మి నాలకింపు।
మానందమయమునై యపవర్గపురమనఁ
బరిఢవిల్లు నయోధ్యపట్నమందు
నగయఁ బరబ్రహ్మ మను దశరథుఁడు వి॥

దరువు॥ రాజిల్లుచుండు నింపుగా । చిదానందుం
డై । తేజరిల్లుచు సొంపుగా । రాజవదనరో!
ని । రాజ్యపదముగా నేత । దాక్షిణ్యాధికారమున
నం । పూజనీయుఁడగుచు వి॥ రా॥

8. సరవినయ్యనఘుఁ డిచ్ఛాశక్తియు క్రియా
శక్తియు మఱిఁ జ్ఞానశక్తులనఁగఁ।
దగు ముగ్గురంగనల్ఁ దగఁ బరివేష్టింపఁ
జెన్నొందుచుండు నా చెలులలోనఁ।
“జ్ఞాన” శక్తియైనెడు కౌసల్యాంగనాగర్భ

మం దాత్మయను రాముఁ డనుసరించి
యవ్యక్త మనెడు కాల్యానవస్థచే స్వస్వ॥

దరు॥ రూపజ్ఞానము మఱచీ । అజ్ఞాన మయుం
డై । దీపించా జీవాత్మను దఱచీ॥ ప్రాపుగఁ
దానను భ్రమ । మూపాదింపఁగఁ దేహేంద్రి
య । ప్రపంచాభిమానము । చే పరవశుఁడై
స్వస్వ॥ రూ॥

9. అటుమీఁద శ్రవణ మనల వశిష్ఠోప దే
శమ్ముచే మఱల జ్ఞానమ్ముఁ గలిగి ।
నన్ను వైరాగ్యమను సౌమిత్రితోఁ గూడి
మననమను గాధినందనుని వెంట ।
నరిగియుఁ బంచమహాపాతకవనీధ
రములనెల్లఁ గ్రమక్రమముగఁ గడచి ।
జ్ఞానమనెడు తీక్ష్ణశరవరంబున నాన॥

దరు॥ రణమను తాటకినీ వధియించీ । ఇచ్ఛ
యనెడు మారీ । చుని సముద్రంబులో ముం
చీ॥ ఘనవికారములనఁగఁ । జను సుబాహు
ప్రముఖులగు । దనుజాళిఁ బెకల్చిసం । హా
ననముఁ జేసి యావ॥ ర॥

10 ఆ యనంతరముఁ దురాచారపాషాణ
మంఘ్రితో మోఁది కృపాళుఁడయి; స।
దాచారమునెపు యహల్యను మన్నించి
యేకాంతమనఁగ నింపెసఁగుచుండు।
మిథిలాపురముఁ జొచ్చి మిాఁది శాంతమునెపు
జనకావనీశు దర్శనముఁ జేసి।
చెలఁగియసూయనాఁ జెలువాదు నా ధను॥

దరువు॥ ర్భంగంబుఁగావించి। ఆనందమును సీ। తాం
గనమణిని గాంచీ॥ రంగుగనాయువ। తింగయి
కొని యు।ప్పొంగి సురలు "భేష"నంగనా
ధను॥ర్భం॥

11. పదపడి ప్రతిఘటింపఁగవచ్చు మదమును
భార్గవరాముని భంగపఱచి।
మోదమున్ సాకేతపురమున కేతెంచి
తాను జీవుండుఁగా దంచుఁ దలఁచి।
జీవత్వమును దాఁట్యించి పట్టాభిషే
కమ్ముననహింప యత్నమ్ముఁబూని।
యరయఁ గ్రియాశక్తియను కైకకతమున॥

దరువు॥ జపలత్వమనెడు విఘ్నము। కలుఁగఁగ
బ్రహ్మమానా। నిపుణదశరథుని నాటకమా॥

విపరీతముగ విడియా।యుపవర్గమనెడు సాకే॥
తపుగంబుఁ బాసెఁదా।నపు డబ్బురంబుగ॥ జ।

12. అంతటానంద సీతాంగనామణియు వై
రాగ్యమనల సుమిత్రాత్మజుండుఁ।
దన వెంట నడువఁ జిత్తమనెడు నరయువుఁ
దాటిబుద్ధియనంగఁ దనరు గుహుని।
యాదరణమునంది యామీఁద నిక్షేప
మను మహారణ్యంబునందుఁ జొచ్చి।
గురుతపస్సను చిత్రకూటస్థుఁడై యహం॥
దర్వ॥ కారమనువిరాధునీ। బొలియించి మన
స్సను। కాకాసురాకారునీ॥ మారీసంకల్ప
మనుక। న్నాసూఢిఁ గుచ్చియుఁ బేర్మిమూరని
ర్వికల్పమను। ధీరాత్మువాసఁగి యహం॥ కా॥

13. వీర్యమను నగ స్త్ర్యవిమలర్షి నాశ్రయించి
ధైర్యమనాస్త్రంబుఁ దగఁ గ్రహించి।
కామమన్ శూర్పణఖను విరూపిణిఁ జేసి
యాగామికర్మంబు లనఁగఁబరగు।
ఖరదూషణాది త్రిశిరులను ఖండించి
యిచ్ఛయనెడు మారీచుఁ డెలమిఁ దన్ను।
వంచింపఁగా నమందంచిత రాజసం॥

దర్వు॥ బనేడురావణాసురుఁడూ। దంభమనెడుస।
న్న్యాసివేషమున నపుడూ॥ చణుఁడై యా
? నందమనెడు । జనకతనూజను । గైకొని యు
బ్బరముగఁ దాఁ। జనియెనరాజసంబ॥

14. ఆత్మఁడన్ శ్రీరాముఁ డటుపై విజృంభించి
యిచ్ఛయన్ మారీచు నేఁ పరించి।
యానందమనెడు సీతాంగనం గాన కా
మోఘవైచారమ్ముఁ బొందిపోంది।
తిసతోడ వైరాగ్యమును లక్ష్మణుఁడురాగ
విక్షేపమనఁగఁ దురీక్షమైన ।
నల కికారణ్యంబు నందుఁ దిరిమ్మరుచు, వి॥
దర్వు॥ వేకామనుజటాయువునూ । విమలత్వ
మనెడ । స్తోకి పదవి నొందించియునూ॥ వీఁ
కఁ జింతయనె । డా కబంధుని దుంచి। జో
కాతోనాశ్రితర। తూకరుఁడగుచు వి॥ వే

15. అటుపయి సంతోషమను శబరినిఁ గాంచి
సరస మనోవికాస మను పూజ।
నంది యంతట విధిధ్యాస మనెడు మారు
తాత్మజుతో సుహృద్య మొనరించి।
మొగి సప్తవిధజన్మముల నంగఁదగ సప్త

తాళమ్ములను విభేదమ్ముఁ జేసి।
భయమను వాలినిఁ బరిమార్చి నిర్భయ।

దర్వి॥ మను సుగ్రీవునిఁ దేర్చి। నిధిధ్యాసమను।
హనుమానునిఁ బంపి॥ ఘనతరముగఁ బురికొ।
ల్పిన నాతఁడు మోహ। మనుసింధువును ని
ఘ్నుడై దాటెను నిర్భయ ॥మ॥

16. పిదప లోభ మనఁగఁ బెంపొందు లంకిణీ
వశీఁ దునుమాడి దుర్వాసన లను।
నక్తంచరుల నెల్ల నాశంబు నొనరించి
యానంద మను సీత నంతఁగాంచి।
కడఁగి సంకల్పమన్ ఘనతరాశోకవ
నంబు నెల్లను శిథిలంబుఁ జేసి।
యావిద్యాసజ్ఞాన మను జంబుమాలిని॥

దర్వి॥ మణుముఁ జేసి సంశయమనూ। అక్షుని
శిక్షించి। మఱియు విపరీతమనూ॥ వఱలెడిం
ద్రజిత్తును, వారించిభ్రమమును, నెఱిపాశ
మును దెంచి। నెగడిపోగడ్తఁగాంచి॥ను॥

17. తదనంతరమున మందత రాజసంబను
రావణాసురునిఁ బరాభవించి।

మోహమనే మహాదగ్ని మతిఁ బ్రజ్వలింపించి
దుఃఖమనే లంకఁ మొత్తుముగఁ।
దగ్ధంబుగావించి తన మోహమను వార్ధిఁ
దాటి మరలివచ్చి తనఁ దగ్ధాత్ముఁ।
డనురామమూర్తి కాయానందమనేడు వై॥

దరు॥ దేహావార్త నుదెల్పఁగా। ఆత్మండను రా
ముం। దూహించాసతిసిఁ గైకొనఁగా॥ పోహ
ణఁ జేసియా । మోహమనెడుసింధు , వాహ
భంగపెట్టిస। సాహసామే మందు వై॥ దే॥

18. అటులఁగావించి పిమ్మటనిశ్చలత్వమ
నఁగఁ దగు సేతుబంధనముఁజేసి ।
సత్త్వమనెడు విభీషణుని చేఁబట్టియు
విపరీతమనఁగను వెలయుచుండు ।
యింద్రజిత్తునుడాసి సందేహమన్ నాగ
పాశమ్ములోఁ జిక్కపరగ సద్గి।
చారమనే వినతాకు మారు చేవిడుగర॥

దరు॥ కెందీతానుసమనెడూ। కుంభకర్ణునిం।
పొంద దానిమినఁ నపుడూ॥ క్రందుగ భ్రిమ
యనుశర। మంద్ర వైరాగ్యమనఁ కెలు। వేంద
సౌమిత్రిమూర్ఛ। నొందెను విడుగర॥ కెం॥

19.అతివరో! వినుమాత్మయందు కౌసలేయుఁ డం
తటసిద్ధిధ్యానవాతాత్మజునకు ।
నుత్సాహపఱచి మహోద్యమంబుననిష్ఠ
యనెడు సంజీవాద్రి నాతఁ గాంచ।
నొప్పించి మించినవైరాగ్యమనెడు సుమి
త్రా కుమారకుని మూర్ఛ వెడలించి ।
యామీఁద విపరీత మనె డింద్రజిత్తు నా॥

దరువు॥ జనుసీ పొంలికసిచీ । నంచితబలు । గము
ను కలవర పరచీ॥ క్రమముగను సాధ । న
మను మోహనాస్త్ర మూ । లమున నామూ
లబ । లమునంతఁ బత్రి నాగూ॥ జ॥

20 దుర్వాస నాసుర స్తోమంబునెల్ల వి
నాశమ్ముఁ జేసి సద్వాసనలను ।
వనచర బలగమంతను సంతరించియు
నావలఁ గాంభీర్యమను శరంబు ।
సంధించి పేదప గాజసమును పక్షికం
తు నెదిర్చి జ్ఞానమనె ఘంటరాస్త్ర ।
మపుడు ప్రయోగించ్యహంకారమును సుధా॥

దరువు॥ కలశభేద పెంబనర్చి । ఇంద్రియములను।
తలలుపడి పోకార్చి॥ బలు మానాగ్నినుండి।

పారిశుద్ధ్యము వహించి। వెలువడిన యానం
ద మై । ధిలినిఁ గైకొనె సుధా॥౯॥

21. బ్రహ్మమునఁ దశరథుఁ బరగసందర్శించి
మోక్షము నెడ యోధ్య పురవుఁ జేరి।
పెండిజీవత్వని వృత్తి యనఁ పట్టాభి-
షేకమ్ముఁబొంది యస్తోకగతిగ,
బ్రహ్మము నెడుపక్షి రథుఁడు తా నై మించి
నిర్వికారంబున నిందృమగుచు ।
భ్రాజిల్లు నాపరబ్రహ్మ రాజ్యాధిప॥
దర్వ। త్యమ్ముఁ దావహించి । మహదానం
దమునొందఁగఁగాంచి॥ తమ్మునెఱుంగు వారి
కిమ్ముగ నుండి ని । త్యమ్ముగ నుండు రా ।
జ్యమ్మున కాధిప॥ త్య।

22. రంజిల్లెనటుల సామ్రాజ్యాధికారియై
యాత్మయన్ రాముఁడో యంబుజాక్షి ।
పరమగోప్యంబంచుఁ బ్రస్తుతింగాంచు రా
మాయణంబున కంతరార్థ మిదియౌ ।
యంచుఁ గోరిక సముదంచితంబుగ నెఱిం
గింప నాఁవ్రాఁబోడి యింపుమీరఁ ।
దనప్రాణవిభుఁ గాంచి తద్దయు భక్తితోఁ॥

దరువు॥ కరయుగ్మములు జోడించి । యిటులను
నమ । స్కరణము నాచరించు॥ అరుదూగ
రామాయ । ణాంతరార్థము మీా । కరుణా
రసమున సాం । గముగా వింటి ననుచు॥ గ॥

23. అంతనాగారి భక్త్యావధానగమున కు
ప్పొంగుచు సభవుఁ డామోదములర।
నిట్టులఁ బలికెనో! యింతి నోసద్గ్రంథ
మతిభక్తిఁ బఠియించు సట్టివారు।
అనవరతానురక్తి నితాంత శ్రద్ధంబో
మించి యీా గ్రంథమాలించువారు।
సావధానాయత్త స్వాంతరంగమునసీ॥

దరువు॥ గ్రంథముఁ జేర్కొను వారూ। నిశ్చలము
గానీ। గ్రంథముఁ జదివించువారూ॥ బంధు
రముగ భవ। బంధములు బాసి ను। ధాం
ధసపురమిరు। వొందఁ గాంతురు తుదకీ॥ గ్రం॥

24. శ్రీభార్గవీవిరాజిత దేవినేని వం
శాంభోధి పూర్ణశశాంకుఁ డనఁగ।
భాసిల్లు వేంకటస్వామికిఁ బిచ్చమాం
బనెడు సాధ్వీమణి కగ్రసుతుఁడ।
శ్రీకృష్ణపాద రాజీవద్వయము సము

దంచితంబుగను సేవించువాఁడ ।
ధీజనంబులకు విధేయుండ నగుచు స॥

దర్వ॥ద్భక్తిఁ జరించువాఁడ। సూరకవి యనంగ
వ్యక్తిగ మెలఁగువాఁడ॥ శక్తికి దోఁచినటు
లాసక్తితో వ్రాసితి వి। రక్తిఁ జూడక
నను। రక్తిగఁ జదువఁ జేది స॥ద్భ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ.



## మంగళహారతి

నాటకురంజిరాగం - అటతాళం.

మంగళహారతీ । మహితశ్రీపతీ॥ మం ॥
సంగరహితో। త్తుంగబాహుబ। లాంగరఘు
కుల । పుంగవా ॥ మం ॥

1. సుగ్రీవా । పరిహృతదశ । గ్రీవా । ధృత ।
గ్రావానత సు। ఈగ్రసుగ్రంశోద్భవా । అ
జ। రాగ్రోజిత భార్గవా॥ ఆగ్రహముడిగి
పూర్ణతరసా। నుగ్రహంబునఁజూడవా॥మం

2. బుధగేయా । భక్తజనవి । ధేయా । ఫల
దాయా ॥బు॥ విధువిభావసులోచనా । దశ ।
రథమథితవైరోచనా । పృథులను కోర్కెమ
యుఁడననుచుఁ । బ్రథితముగ సేవింతుఁ
జయ ॥మం॥

3. భూరివిలాసా । తక్రిపుర ని । వాసా । వి ।
కాసా ॥భూ॥గారమున భక్తాళినీ । వి । స్తార
కృపనేలుదువని । కోరి నినుగీర్తించుచుంటిని
సూరకవినుతనీకుఁ జయ ॥ మం॥

శ్రీ శ్రీ శ్రీ.

# ప్రకటన.

| | రు అ. పై. |
|---|---|
| ముకుందస్వామి శతకము | 0—1—0 |
| నాగ రేశ్వరశతకము | 0—1—0 |
| రామాయణాంతరార్థప్రకాశిక | 0—1—0 |
| శ్రీహనుమదభ్యుదయము | 0—8—0 |

(అచ్చులోనున్నది.)

దేపినేని సూరయ్య,

చల్లపల్లి,

కృష్ణాజిల్లా.

